# రాజిత గురురాజ
# రాఘవేంద్ర
# శతకము

రచన

వై.వి. వెంకటేశ్వరరావు

# ముందుమాట

"శేషశైలవాస - శ్రీనివాస" పంచశతితో ప్రారంభించిన నా శతక రచనలో ఇది అయిదవది. పుస్తక రూపంలో, పంచశతిని అయిదు శతకాలుగా పరిగణిస్తే ఇది తొమ్మిదవదవుతుంది. శ్రీ రాఘవేంద్ర స్వామి వారిపై శతకం వ్రాయ సంకల్పించే నాటికి ఆరోగ్యం సరిగా లేదు. "మొదలు పెట్టు, మొదలు పెడితే శతకం పూర్తి అయ్యేట్లు శ్రీ గురురాఘవేంద్రులు చూచుకుంటారు" అన్నాడు నామిత్రుడు శ్రీ శివరామయ్య. "రాజిత గురురాజ రాఘవేంద్ర" అన్న మకుటంతో శతక రచన అయింది. శ్రీ గురురాఘవేంద్రుల జీవిత చరిత్రను, వారి లీలలతో, మహిమలతో మేళవించి వ్రాశాను. మంత్రాలయం గురించి అందరికీ తెలుసు. 1956 లో నేను రాయచూరులో ఉద్యోగ రీత్యా ఉండే రోజుల్లో మొదటి సారి మంత్రాలయం మిత్రులతో కలిసి వెళ్ళాను. నాకు తెలిసినంత వరకు, కర్ణాటకంలో శ్రీ స్వామివారి బృందావనాలు చాలా ఉన్నవి ; శ్రీ రాఘవేంద్ర స్వామి వారిని ఆరాధించే భక్తులు కూడా ఎక్కువే. ఎన్నో సంవత్సరాల నుంచి బెంగళూరులో స్థిరపడిన కారణంగా నేనీవిషయాన్ని గ్రహించాను. ఈ బృందావనాలలో ప్రతి గురువారం ఆరాధన చాలా ఘనంగా జరుగుతుంది.

శతక రచనలో, ప్రచురణలో నాతో సహకరించిన మిత్రులకు, శ్రేయోభిలాషులకు, నా కుటుంబ సభ్యులందరికీ నా కృతజ్ఞతా పూర్వక అభినందనలు.

నా స్వర్గీయ 'రమ' పేర ప్రారంభించిన అకాడమీ ద్వారా ఈ శతకం కూడా ప్రచురితమౌతున్నందుకు ఎంతో సంతోషంగా వుంది.

మీ

వై.వి. వెంకటేశ్వరరావు

# రాజిత గురురాజ రాఘవేంద్ర

## అవతరణం

తిరుమల గిరిప్రభుని కరుణా ప్రభావమున
అమ్మ గోపికాంబ అయ్య తిమ్మ
నార్యుల వరసుతుగ నవతరించె నతడె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

వేంకటేశ్వరుదయ వెలసి నాడుగనుక
నామకరణమాయె, స్వామిపేరె;
వెలిగె బాల్యమందు వేంకటనాథుగ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఓర్మితోడ తండ్రి ఓంకారమును చెప్ప
నర్థ మేమియనుచు నడిగె బిడ్డ;
అర్థమెరుగని పని వ్యర్థమని తలంచె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

వీణ వాద్యమందు విద్వాంసుడైనాడు,
వేద, న్యాయ, కావ్య మాదిశాఖ
లందు సల్పె కృషిని, పొందెను ఘన కీర్తి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

అన్న, బావ లిండ్ల నెన్నదగిన రీతిఁగ
గ్రంధ పఠన మాది క్రమ నిబద్ధ
కార్యమగ్నుడాయె కాలగమనమందు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఎట్టి గ్రంధమునకు దిట్టయౌ వ్యాఖ్యను
వ్రాయుచుండె చిరుత ప్రాయమందె,
టీక, టిప్పణులలవోకగా రచియించె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## చందన మహిమ

కుంభకోణమందు గురుసుధీంద్రుల చెంత
చేరుకొరకు పోవు దారిలోన
ఆగె నొక్క చిన్న అగ్రహారము నందు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

జరుగుచుండె నపుడొకరి యింట శుభకార్య
మందు పాల్గొనంగ మంది చేర,
నందు విప్రుడొకడు నయముగ బిలిచెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

బడుగు బాపడంచు భావించె నొక పెద్ద,
బంధు జనుల కీయ చందనమును
తీయనానతిచ్చె, తీసెను విధిలేక
రాజిత గురురాజ రాఘవేంద్ర.

చందనమును తీయు సందర్భమున నగ్ని
సూక్తము జపియించు చున్న కతన
మంటలనుచు నేడ్చి రంటినత క్షణమె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

అంతనందరప్పుడతని క్షమను వేడ
వరుణ సూక్తమాడి, మరల తీసి
చందనమ్మునీయ చల్లబడిరివారు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## పరిమళాచార్యుడు

వెడలెనంత వడిగ వేంకటనాథుడు,
చేరెగురుసుధీంద్రు చెంత చదువ,
కొలది దినముల నట తలమానికమాయె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

శ్రీ సుధయను గ్రంధమా సుధీంద్రుల గురు
విరచితమది, దాని వివరణమును
దెలుపుచున్న గురుడు నిలిపె సందియమంది
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నాటినుండి 'సుధ' ను దీటుగా పఠియించి
టిప్పణమును వ్రాసి మెప్పునందె
"పరిమళం పు" కర్త పరిమళాచార్యుగ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

శ్రీ సుధీంద్ర తీర్థ శిష్యుల ముఖ్యుడై
వారితోడుత ప్రచారమునకు
వెడలి అన్ని సభల విజయము సాధించె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

అతి నిశిత మనంతమతని తార్కిక శక్తి,
వాద వాక్చతురిత వాడి, వేడి,
అహములేని దివ్యమహనీయుడాతడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## ఆశ్రమ స్వీకారము

ఇంత ప్రతిభయుండి చింతలపాల్పడె,
వెతల నింపెనతని పేదరికము,
చేరె గురుసుధీంద్రు వేరుమార్గము లేక
రాజిత గురురాజ రాఘవేంద్ర.

శ్రీ సుధీంద్ర తీర్థులానగ వేంకట
నాథు పిలిచి మఠమున కధిపతిగ
నిలువు మనుచు కోర, వలదని వారించె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మూల రామచంద్రు మూర్తి గొల్చు గురువు,
తల్లి శారద కనుగు తనయుడీత
డిరువురి కలలోన పరమార్థమొక్కటే
రాజిత గురురాజ రాఘవేంద్ర.

తనయుని కుపనయనమొనరించె వేడ్కగ
నంత స్వీకరించె నాశ్రమమ్ము
నాడె రాఘవేంద్ర నామము స్థిరమాయె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## రత్న హారము

బావిలోన దూకి బాసెన సువుసతి,
ఆత్మహత్య ఫలితమామె ప్రేత
రూపమంద, రూపు మాపి మోక్షమిచ్చె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

బయలుదేరి దిగ్విజయ యాత్ర గావించు
నపుడు విశ్వశ్రేయమెపుడు గురి ;
దారిలోన నిలిచె తంజాపురము చెంత
రాజిత గురురాజ రాఘవేంద్ర.

వానలేమిలేక ప్రాంతము కరువాయె
నూరినేలురాజు చేరివేడ
కొలిచెయజ్ఞ పురుషు, కురిసె కుంభ వృష్టి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

రాజు ప్రీతి చెంది రాయని కొకరత్న
హారమీయ, దాని జారవిడిచె
నగ్నికుండ మందు, నత హస్తములతోడ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

అగ్ని కర్పణముగ ఆహుతి చేసిన
రత్న హారముగన రాజుకోర
దివ్య మహిమ  చూపితిరిగి రప్పించెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

సర్వము తనదైన సర్వేశ్వరునకేమి
కావలె ? మనమిచ్చు కాన్కలన్ని
మనకు శుభము కోరి, మన కోసమే కాని
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## గ్రంధ రచన

చేరె మధుర గురుడు, తారసిల్లెనచట
నీలకంతుడనెడి నిగమ వేత్త
ఇరువురినడుమనట జరిగె వాగ్వాదము
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నీలకంతు మోము నీలి మబ్బుగమారె
గురుని వివరణలకు తిరుగులేక ;
వాదములనె కాదు, వాదుల హృది గెల్చె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

గురువిరచిత గ్రంధమరయమీమాంసకు
దర్పణమని ఖ్యాతి ధాత్రిలోన
"భాట్ట సంగ్రహ" మనిభాష్యకార్ల కెరుక
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మధుర రాజగు తిరుమల నాయకుడు, తన
మంత్రి నీలకంతు మాటలువిని
గజముపైన నుంచి గ్రంధమూరేగించె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

కడు పవిత్రమైన ఉడిపి క్షేత్రమందు
చిన్ని కృష్ణు గాంచి, సన్నుతించి
మోదమలర వ్రాసె వేదాంత గ్రంధాలు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మధురముగ నుడివెను మధ్వసిద్ధాంతాల,
తాత్విక శక్తిని తరచి పలికె ;
ద్వైత మందునగల దైవత్వమును దెల్పె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

టిప్పణముల వ్రాసి టిప్పణాచార్యుల
సార్వభౌముడనుచు పేర్వడసెను,
వ్యాఖ్యలెన్నొ వ్రాసి ప్రఖ్యాతి గాంచెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

తనకు పూర్వికులగు ఘనుల గ్రంధములందు
నున్న అంతరార్థమెన్న దెలుప
వ్రాసి రన్నికృతులు, వ్యాఖ్యలు, భాష్యాలు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## పండరి పురము

పండరి పురమునకు పయనమై జనుచుండ
దారిలో నెచటను నీరులేక
దారిపోవు వారు దాహమనుచు వేడ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

సరిగ, ఆ క్షణమున గర్భిణి స్త్రీ యొర్తు
ప్రసవ వేదనమ్ము పడుచు నుండ
వేడి కోర్వలేక వేసారు చుండంగ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఉచ్చరించె మంత్ర ముదయించె నుజలము,
నింగికెగుర వైచె నుత్తరీయ
మదియె నీడ యాయె మహిళకా సమయాన
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నడుమున కరము లిడి కడుఠీవి నిలిచిన
పాండురంగని గని ప్రణుతి చేసి
పరవశించి నిలిచె పండరి పురమున
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## దేశాటనము

శ్రీనివాసుని సతి శ్రీ మహాలక్ష్మికి
నిలయమైన నగరు కొల్హాపురము
చేరి జ్ఞానబోధ చేసెను జనులకు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

సాగిపోవుచుండె సరి, బిజాపురి వైపు,
చూచెనుసురు విడుచు చున్నవాని,
మంత్రజలము చల్లి మహిమ నూపిరిపోసె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నాడు తేలుచుండె నాలూరు సిరులలో,
నచటి జనులు నిత్య సచ్చరితులు,
నిర్మల పరిసరము నిలిపె భావుకతను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

"భావదీప" మనెడి భవ్య టిప్పణమును
"తత్వ మంజరి" యను తత్వ వ్యాఖ్య
రమ్యముగ రచించి రాలూరు నందుండి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

శివుని నిలయమైన శ్రీశైలమును చేరి
మల్లిఖార్జునుకు నమస్కరించి
కదలెనచట నుండి కపిల తీర్థమునకు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఎవరి వరమున నతడవతరించె నిలనా
దేవదేవుడుండు తిరుమలగిరి
కేగి మ్రొక్కినిలిచె కొండలయ్య మ్రోల
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ద్వాదశాబ్ద కాల మాదయామయునకు
వ్యాసరాయుగ తను చేసినట్టి
సేవజ్ఞప్తి కెలయ, శైలము విడలేడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మానవాభ్యుదయము మదిని కోరెడివారి
కాలు నిలువదొక్క కడ నిలువగ ;
తిరుమలేశు తలచు చరిగిరి కంచికి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

కంచి క్షేత్రమందు కాంచెను కనులార
వరదరాజ స్వామి వారి మూర్తి,
కాంచెనటులె దేవి కామాక్షి అమ్మను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

విజయ యాత్ర ముగిసి, విజయోత్సుకత తోడ
రాణచేరె కుంభకోణమునకు,
కృతుల కూర్చెనందు రతు లితానందముగ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## ముగ్గురు జోస్యులు

జోస్యులు మళయాళవాసులు ముగ్గురు
వారివిద్యలోన వారికి గల
ప్రతిభ చూపగనున మతిని కోరిరి, వచ్చి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

గురుని జాతకమునె గుట్టుగ ముగ్గురి
కిచ్చి చూడ మనుచు నిచ్చగింప
వేరువేరు చోట్లు వారికి నియమించె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఒకరి జాతకమునె యొసగిన సంగతి
తెలియ నట్టి పండితులతివేగ
వ్రాసిరి ఫలితమ్ము వారి శక్తి కొలది
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఆయు నిర్ణయమున నా యెవ్యత్యాసము,
శతమని యొకరు, త్రిశతమని మరి
యొకరు; సప్త శతమె యనిరి మూడవవారు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మూడును సరియనియె ముచ్చటగ గురుండు ;
సార్థకమగు విద్య సాధనమున,
నిష్ఠనాడు మాట నిజమగునని యెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మనుజ రూపమందు మనెద నూటికి లోపు,
గ్రంథములను మూడు వందలేండ్లు
మహిమలందు నేడు వందలేండ్లనియెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

# మరికొన్ని రచనలు

రూపు నీయనెంచె ఋగ్భాష్యటిప్పణి
నంతలోన వ్రాసి చెంత నిడెను
లక్షణుడగు సుతుడు లక్ష్మినారాయణ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

సుతుని రచనము తగునుతిని పడయకోరి
తాను టిప్పణమును దలపలేదు ;
మధురముగ రచించె మంత్రార్థమంజరి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

భక్తి కొలవవలయు భగవంతునెరుగంగ ;
కలుగు భక్తి గ్రంథముల పఠింప ;
భక్తి పెరుగ వ్రాసె భవ్య కావ్యములను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మనుజకోటి ధర్మ మార్గమను సరించి
మనెడి తీరు దెల్పుమనకు 'గీత',
భావవ్యాఖ్య వ్రాసె 'భావదీపిక' లని
రాజిత గురురాజ రాఘవేంద్ర.

'గీత ' భరతజాతి నీతికి హృదయము ;
రామ, భరతకథలు రాగసుధలు,
స్తోత్రములను వ్రాసె స్తుతరీతి రెంటికి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

భక్తు కోర్కె తీర్చ భగవంతుకిష్టమై
దాల్చెతా పదియవతారములను ;
స్తోత్రమున వతార శోభ దెల్పుచు కూర్చె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

జనుల నుద్ధరింప జన్మ నెత్తెను గాన,
జనులు ధర్మ మార్గమనుసరింప
"భావ సంగ్రహము" గ భారత కథమలచె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

గద్య, పద్యములను గ్రంథ రాజములను
టీకటిప్పణములనేక కృతుల,
వ్యాఖ్య వివరణముల వ్రాసి జగతికిచ్చె
రాజిత గురు రాజ రాఘవేంద్ర.

## ఎండు కట్టె

"నవిలి గుంద" గ్రామ నాయక దేసాయి
నాస్తికుండు, మొండి, ఆస్తిపరుడు,
వాడి కెదురు మాటలాడు వాడటలేడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఎండుకట్టె నొక్క టేరెను దేసాయి,
వేదము నిజమనెడి వెర్రులార
దీనిని చిగురింతురేని నమ్మెదుననె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

చల్లె గురుడు మంత్ర జలమెండు కట్టెపై,
పట్టె చిగురు కట్టె కిట్టె చూడ,
దేవుడు నిజమనుచు దేసాయినమ్మెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## పునర్జన్మ

వినుత గుణుడతండు వెంకటదేసాయి
'గదగు' నకు సమీప గ్రామ వాసి
రాయుకోరె మూలరాము పూజను సేయ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

పూజనందువాడు మూల రాముడాయె
పూజసేయువాడు రాఘవేంద్రు
డెంత భాగ్యవంతు డీ భక్త దేసాయి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

రామచంద్రు పూజ రాఘవేంద్రుడు చేయు
ననెడి వార్త ప్రాకె నన్నిదిశల
కందరేగు దెంచి రందుకొ౦న ఫలము
రాజిత గురురాజ రాఘవేంద్ర.

చూత ఫల రసమును పాత్రలందున నింపి
వంట చేసినారు వంటవారు,
పూజలొక్క వైపు, బోజనాలొక వైపు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

పండు రసము పెద్ద పాత్ర నుండుట జూచె
పిన్నవాడు, గ్రామ పెద్ద సుతుడు;
పాత్రలోన పడెను, ప్రాణము పోయెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

గ్రామ పెద్ద, యతని భామయు గురుచేరి
మొరను పెట్ట గురుడు కరుణ తోడ
మృతున కిచ్చె బ్రతుకు మంత్ర జలము చల్లి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## దివాను వెంకన్న

"ఆదవాని" ప్రక్క "కందనాతి" యనెడి
పల్లెలోన నుండె బాలు డొకడు
పేరు వెంకనయని పెద్ద దేవుని పేరు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

చదువ లేదు కాని సహృదయుడ తండు;
తలచి నంత వచ్చి నిలుతునంతు
వరము నిచ్చె గురుడు వాని భక్తికి మెచ్చి
రాజిత గురు రాజ రాఘవేంద్ర.

అంతనొక్క దివస మబ్దులాఖానను
ప్రభువు వేట కొరకు వచ్చెనచటి
కింతలోనె సైనికుండు జాబును తెచ్చె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

చదువురాని రాజు జాబును చదివింప
చూచెనటు నిటు, గనె వెంకన నట,
చదువ జాబు నిచ్చె, చెదిరెను వెంకన్న
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మదిని వెంకన గురు పదముల ప్రణమిల్లి
లేఖ తెరచి చదివెనేక బిగిని,
విన్నరాజు పొంగి, వెంకన గొనిచనె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

వలయు విద్యను నేర్చి, తెలివి ప్రదర్శింప
నాదవానికే దివాను చేసె
ప్రభువు ; తలపులోనె పలుకు మహాత్ముడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## మృత్తికా మహిమ

కదలె శిష్యుడొకడు వధువునెన్నుకొనగ ;
శౌచవేళ గురునికాంచి, విత్త
మడుగ, నగుచు నిచ్చె పిడికెడు మట్టిని
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మన్ను మూట గట్టి మరలిన శిష్యుడు
విశ్రమించె నొకరి వీటి ముందు,
బ్రహ్మరాక్షసుండు బలి కోరివచ్చెను
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మృత్తికకు భయపడి మర్త్యుడు నిలబడి
శిష్యులేపె మంటి శక్తి తెలియ ;
మన్ను జల్లి మర్త్యు మట్టు బెట్టెను శిష్య
రాజిత గురురాజ రాఘవేంద్ర.

అంత నాగృహస్తు సంతసమున, తన
తనయనిచ్చె నటులె ధనము నిచ్చె,
మరలె శిష్యుడు, సతి, గురుని దీవన లంద
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## ఆవాలు

మంచి భక్తుడొకడు, మలిన వసనధారి
నిలిచె గురుని ముందు తలను వంచి,
మూలరాముకిమ్ము ముడుపు శ్రద్ధగననె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఇంటికేగి తెచ్చె నిన్ని ఆవాలను,
గురునికిచ్చె ; వాని గురుడు వంట
వానికీయ బోవ, వల్లెయనెనువాడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

వ్రత పవిత్ర దినాల వాడరాదావాల
ననిన మఠములోని ఘనుల గాంచి,
కనకదాసితండు గత జన్మమున ననె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నాడు మొదలు పెట్టి రావాల వాడుక
పేద భక్తవర్యు పేరు నిలుప,
రాము గొలుచువారికేది సాధ్యముకాదు !
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## మంత్రాలయము

ఆదవానికి గురుడరుదెంచు ననువార్త
విని, దివాను దొరకు విన్నవించె ;
గుట్టుగ దొర తలచె, గురుని పరీక్షింప
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మంచి పళ్ళెమొకటి మాంసముతో నింపి
పట్టుబట్ట దాని పయిన కప్పి
అందు కొమ్మ నెదొర ; ఆంతర్య మెరింగె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

అన్ని తెలిసిన గురుడదిగొను నెపమున,
మందహాసము తోడ మంత్రజలము
చల్లి, వస్త్ర మెత్త, పళ్ళు పూలుగ మార్చె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఖాను దొరకు కలిగె జ్ఞానోదయమపుడు,
గౌరవమ్ముగ జహగీరునిచ్చె
మంత్రి మాట నిలుప ; మంత్రాలయమదియె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

తుంగభద్ర తీర రంగము గురువరు
కాయెవాసము, మనకాయెను గుడి,
అందరి నలరించు బృందావన మమరె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

పూర్వ యుగములందు పూజనీయమైన
యాగభూమి ఇదియె యోగ భూమి,
మాత పేర వెలసె మాంచాలగా కూడ
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మహిని విస్తరించెమ ధ్వసిద్ధాంతమ్ము,
భాతి తెలిపె భువిని ద్వైతశక్తి
గురువుల గురువైన గురురాజ చంద్రుడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## బృందావన ప్రవేశం

శ్రీ విరోధి కృత్తు శ్రావణపు బహుళ
విదియనాడు గురుడు, విశ్వదూత
అందరు గనుచుండ బృందావనము చేరె
రాజిత గురురాజ రాఘవేంద్ర.

వందలేండ్లు గడచె వృందావనము చేరి
లేరిలనను తలపు లేవదెపుడు,
కనగ, నేడు కూడ కానక కాపాడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నూట యాబదేండ్లు దాటిన పిమ్మట
'మన్రొ' యనెడి దొరకు మహిమ చూపె,
దొరలకు దొర యాతడుర్వి సర్వజ్ఞుడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ప్రథమ జన్మ మందు ప్రహ్లాదుడీతడు, ద్వి
తీయ జన్మ వ్యాసరాయలీత
డీ తృతీయ జన్మ మంత్రాలయనివాసి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

కల్పవృక్షమితడు, కామధేనువితడు,
సత్యధర్మ నిరతి శాంతరీతి
వాంఛితముల తీర్చువాడని ప్రఖ్యాతి
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఈశుడనిన వెంకటేశుడే ఈశుడు
కొండలనిన ఏడు కొండ లేను !
గురువులందు పరమగురుడు మాయతి రాజు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## ప్రార్థన

నలుబదేండ్ల క్రితమె తెలిసె నీమహిమము,
స్వాను భవము నాయె, నేను నిన్ను
మొదటి సారి కనగ కదలివచ్చినపుడు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నేను నా 'రమ' యును నేమాన నినునెంచి
వచ్చితిమి నిను దరిశించి సుఫల
మందుకొనగ నీదు మంత్రాలయమునకు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మనుజ రూపమందు కనబడకున్నను
మాట ఇచ్చి మీరు మమ్ము విడువ
రట్లె నన్విడువదు 'రమ' నాహృదయమ్ము
రాజిత గురురాజ రాఘవేంద్ర.

సకల శుభములిచ్చె సహధర్మచారిణి,
సహజనేత్రి, సాధ్వినాదు
'రమ' కు కలుగచేయు రయమాత్మ శాంతిని
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## వందనము

ఎనుబదేండ్ల మధ్య నెన్నియో గ్రంధాల
వ్రాసిన గురురాజు, వ్రాయ శక్తి
నొసగె నాకు, వాని కొసగెద ప్రణతులు
రాజిత గురురాజ రాఘవేంద్ర.

నీదు హారతులను నియమాన వీక్షింప
నక్షతలులభించు రక్షమాకు
శ్లోకము పఠియింప నీ కటాక్షమగును
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఆటవెలది నిచ్చె నాటి వేమన నాకు
తెలుగు భాష నిచ్చె తెలుగు తల్లి,
వ్రాయశక్తి నిడిరి వాణియు, గురుడును
రాజిత గురురాజ రాఘవేంద్ర.

ఐదవ శతకమిది నీదీవన బలము
వ్రాయ గలిగితయ్య శ్రీ యతీంద్ర
నీవు "రమ" యుమెచ్చ నిక్కమానందము
రాజిత గురురాజ రాఘవేంద్ర.

## మంగళము

జయము పూజనీయ, జయము కళానిధీ
పాపముల హరించు పావనుండ,
వాంఛితముల దీర్చు మాంచాల వాసుడా
రాజిత గురురాజ రాఘవేంద్ర.

మంగళము గురువర, మంగళము యతీంద్ర
మంగళము మునివర, మంజుభాష్య,
మంగళము హరిభక్త, మంత్రాలయ నివాస
రాజిత గురురాజ రాఘవేంద్ర.